# అథ త్రయోవింశో%ధ్యాయః

## వృషభావతారము

నందీశ్వర ఉవాచ |

తతో వృషభరూపేణ గర్జమానః పినాకధృక్ | ప్రవిష్టో వివరం తత్ర నినదన్ భైరవాన్ రవాన్ || 1

నిపేతుస్తస్య నినదైః పురాణి నగరాణి చ | ప్రకంపో హి బభూవాథ సర్వేషాం పురవాసినామ్ || 2

తతో వృషో హరేః పుత్రాన్ సంగ్రామోద్యతకార్ముకాన్ | శివమాయావిమూఢాత్మ మహాబలపరాక్రమాన్ || 3

హరిపుత్రాస్తతస్తే%థ ప్రాకుప్యన్మని సత్తమ | ప్రదుద్రువుః ప్రగర్జ్యోచ్చై ర్వీరాశ్శం కరసన్ముఖమ్ || 4

ఆయాతాంస్తాన్ హరేః పుత్రాన్ రుద్రో వృషభరూపధృక్ | ప్రాకుప్యద్విష్ణుపుత్రాంశ్చ ఖురైశ్శృంగై ర్వ్యదారయత్ || 5

విదారితాంగా రుద్రేణ సర్వే హరిసుతాశ్చ తే | నష్టా ద్రుతం సంబభూవుర్గతప్రాణా విచేతసః || 6

హతేషు తేషు పుత్రేషు విష్ణుర్బలవతాం వరః | నిష్క్రమ్యాథ ప్రణమ్యోచ్చైర్య¸° శీఘ్రం హరాంతికమ్ || 7

నందీశ్వరుడిట్లు పలికెను-

తరువాత పినాకధారియగు శివుడు వృషభరూపముతో భీకరముగా గర్జిస్తూ పాతాళ వివరమును ప్రవేశించెను. (1). ఆ వృషభము యొక్క నినాదములచే పురములు నేల గూలినవి. పురవాసులందరు భయముతో కంపించి పోయిరి (2). అపుడు యుద్ధము కొరకు సంసిద్ధము చేయబడిన ధనుస్సులు గలవారు, శివమాయచే వ్యామోహమును పొందిన మనస్సు గలవారు, మహాబలపరాక్రమవంతులు అగు విష్ణుపుత్రులను ఆ వృషభము

ఎదుర్కొనెను (3). ఓ మహర్షీ! అపుడా విష్ణుపుత్రులు మిక్కిలి కోపించి బిగ్గరగా గర్జించి శంకరునకు అభిముఖముగా పరువులెత్తిరి (4). వృషభరూపమును దాల్చియున్న ఆ రుద్రుడు కోపించి తనపై దండెత్తిన విష్ణుపుత్రులను గిట్టలతో, మరియు కొమ్ములతో చీల్చెను (5). రుద్రునిచే చీల్చబడిన అవయవములు గల ఆ విష్ణుపుత్రులందరు శీఘ్రముగా ప్రాణములను గోల్పోయి మరణించిరి. (6). బలవంతులలో శ్రేష్ఠుడగు విష్ణువు తన పుత్రులు నశించగా బయటకు వచ్చి బిగ్గరగా గర్జించి శీఘ్రముగా శివుని వద్దకు వెళ్లెను (7).

దృష్ట్వా రుద్రం ప్రవ్రజంతంహతవిష్ణుసుతం వృషమ్ |
శ##రైస్సంతాడయామాస దివ్యైరసై#్రశ్చ కేశవః || 8

తతః క్రుద్ధో మహాదేవో వృషరూపీ మహాబలః | అస్త్రాణి తాని
విష్ణోశ్చ జగ్రాస గిరిగోచరః || 9

అథ కృత్వా మహోకోపం వృషాత్మా స మహేశ్వరః | వినవాద మహా
ఘోరం కంపయంస్త్రి జగన్మనే || 10

తత ఉత్ప్లుత్య తరసా ఖురైశ్శృంగై ర్వ్యదారయత్ | విష్ణుం
క్రోధాకులం మూఢమ జానంతం నిజం హరిమ్ || 11

తతస్స శిథిలాత్మా హి వ్యథితాంగో బభూవ హ |
తత్రప్రహారమసహ్యాశు హరిర్మాయా విమోహితః || 12

గతగర్వో హరిశ్చైవ విచేతా గత చేతనః | జ్ఞాతవాన్ పరమేశానం
విహరంతం వృషాత్మనా || 13

అథ విజ్ఞాయ గౌరీశమాగతం వృషరూపతః | ప్రాహ గంభీరయా
వాచా నతస్కంధః కృతాంజలిః || 14

విష్ణుసుతులను సంహరించి వృషభాకారముతో ముందుకు సాగుచున్న రుద్రుని గాంచి కేశవుడు దివ్యమగు శస్త్రాస్త్రములతో ఆయనను కొట్టెను. (8). మహాబలశాలి, కైలాసగిరివాసి, వృషభరూపుడు అగు మహాదేవుడు అపుడు కోపించి విష్ణువు యొక్క

ఆ అస్త్రములను మ్రింగివేసెను (9). ఓ మహర్షీ! అపుడు వృషభరూపములోనున్న ఆ మహేశు డు గొప్ప కోపమును పొంది, ముల్లోకములు కంపించునట్లు అతి భయంకరమగు నాదమును చేసెను (10). తరువాత ఆయన పైకి ఎగిరి విష్ణువును గిట్టలతో, మరియు కొమ్ములతో చీల్చి వేసెను. మూఢుడు, కోపముతో భ్రాంతిని పొందినవాడు అగు విష్ణువు తాను విష్ణువునను సంగతిని విస్మరించి యుండెను (11). మాయచే వ్యామోహితుడైయున్న విష్ణువు అపుడు శిథిలమగు దేహము గలవాడై పీడించే అవయవములు గలవాడై, ఆ రుద్రుని దెబ్బలకు తాళ##లేకపోయెను (12). తొలగిన గర్వము గలవాడు, నశించిన శక్తి గలవాడు, ఆకులితమగు బుద్ధి గలవాడునగు విష్ణువు వృషభరూపములో విహరించుచున్న పరమేశ్వరుని గుర్తు పట్టెను (13). గౌరీపతియే వృషభరూపములో వచ్చియున్నాడని యెరింగి విష్ణువు అపుడు తలవంచి చేతులు జోడించి గంభీరమగు వాక్కుతో నిట్లు పలికెను (14).

హరిరువాచ |

దేవదేవ మహాదేవ కరుణాసాగర ప్రభో | మాయయా తే మహేశాన మోహితో%హం విమూఢధీః || 15

కృతం యుద్ధం త్వయేశేన స్వనాథేన మయా ప్రభో | కృపాం కృత్వా మయి స్వామిన్ సో%పరాధో హి సహ్యతామ్ || 16

విష్ణువు ఇట్లు పలికెను-

ఏ దేవదేవా! మహాదేవా! కరుణాసముద్రా! ప్రభూ! మహేశ్వరా! నీ మాయచే నేను మోహితుడనై వివేకమును కోల్పోయితిని (15) ప్రభూ! నా ప్రభువు అగు నీతో నేను యుద్ధమును చేసితిని. స్వామీ! ఈశ్వరా! నాయందు దయను చూపి ఆ అపరాధమును సహించుము (16).

నందీశ్వర ఉవాచ |

తస్య తద్వచనం శ్రుత్వా హరేర్దీనతయా మునే | భగవాన్ శంకరః ప్రాహ రమేశం భక్తవత్సలః || 17

హే విష్ణో హే మహాబుద్ధే కథం మాం జ్ఞాతవాన్న హి | యుద్ధం కృతం కుతస్తే%ద్య జ్ఞానం సర్వం చ విస్మృతమ్ || 18

ఆత్మానం కిన్న జానాసి మదధీనపరాక్రమమ్ | త్వయా నాత్ర రతిః కార్యా నివర్తస్వ కుచారతః || 19

కామాధీనం కథం జ్ఞానం స్త్రీషు సక్తో విహారకృత్ | నోచితం తవ దేవేశ స్మరణం విశ్వతారణమ్ || 20

తచ్ఛ్రుత్వా శంభువచనం విజ్ఞానప్రదమాదరాత్ | వ్రీడయన్ స్వమనసా విష్ణుః ప్రాహ వాచం మహేశ్వరమ్ || 21

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! ఆ విష్ణువుయొక్క ఈ దీనవచనములను విని భక్తవత్సలుడగు శంకర భగవానుడు లక్ష్మీపతితో నిట్లనెను (17). ఓ విష్ణూ! మహాబుద్ధీ! నన్ను నీవు గుర్తుపట్టలేక పోవుట ఎట్లు సంభవమయ్యెను? నీవీ నాడు నాతో యుద్ధమును చేయుటకు కారణమేమి? నీవు సర్వజ్ఞానమును విస్మరించితివి (18). నీపరాక్రమము నా ఆధీనములో నున్నదని నీవు ఏల గుర్తించవు? నీవిచట ఇంద్రియభోగములలో మునిగి యుండరాదు. ఈ దురాచారమునుండి వెనుకకు మరలుము (19). నీ జ్ఞానము కామమునకు వశ##మైనది. స్త్రీలయందు ఆసక్తిని కలిగి విహరించుట నీకు తగదు. ఏ దేవదేవా! జగద్రక్షణ గురించి స్మరించుట నీకు దగును (20). జ్ఞానదాయకమగు శంభుని ఆ మాటలను విని విష్ణువు తన మనస్సులో సిగ్గుపడి మహేశ్వరుని ఉద్దేశించి ఆదరముతో నిట్లు పలికెను (21).

విష్ణురువాచ |

మమాత్ర విద్యతే చక్రం తద్ గృహీత్వేతదాదరాత్ | గమిష్యామి స్వలోకం తం త్వదాజ్ఞాపరిపాలకః || 22

విష్ణువు ఇట్లు పలికెను-

నా చక్రము ఇచట గలదు. దానిని తీసుకొని నేను సాదరముగా నాలోకమునకు వెళ్లి నీ ఆజ్ఞను పాలించగలను (22).

నందీశ్వర ఉవాచ |

తదాకర్ణ్య మహేశానో వచనం వైష్ణవం హరః | ప్రత్యువాచ వృషాత్మా హి వృషరక్షః పునర్హరిమ్ || 23

న విలంబః ప్రకర్తవ్యో గంతవ్యమిత ఆశు తే | మచ్ఛాసనాద్ధరే లోకే చక్రమత్రైవ తిష్ఠతామ్ || 24

సంతానాదిత్య సంస్థానాచ్ఛివత్య వచనాదపి | అహం ఘోరతరం తస్మాచ్చక్ర మన్య ద్దదామి తే || 25

నందీశ్వరుడిట్లు పలికెను-

పాపహారి, వృషభరూపుడు, ధర్మరక్షకుడు అగు మహేశ్వరుడు ఆ మాటను విని విష్ణువునకు ఇట్లు బదులిడెను (23). నీవు ఆలస్యము చేయవద్దు. ఇచట నుండి వెంటనే బయలుదేరుము. ఓ హరీ! నా ఆజ్ఞచే విష్ణులోకమునకు వెళ్లుము. చక్రమును ఇచటనే ఉండనిమ్ము (24). ప్రలయకాల సూర్యుని కంటె, శివుని వచనము కంటె కూడా అధికమగు సంహారశక్తి గల మరియొక చక్రమును నేను నీకు ఇచ్చుచున్నాను (? 25).

నందీశ్వర ఉవాచ |

ఏతదుక్త్వా హరోఽలేఖీద్దివ్యం కాలానలప్రభమ్ | పరం చక్రం ప్రదీప్తం హి సర్వదుష్ట వినాశనమ్ || 26

విష్ణవే ప్రదదౌ చక్రం ఘోరార్కాయుత సుప్రభమ్ | సర్వామర మునీంద్రాణాం రక్షకాయ మహాత్మనే || 27

లబ్ధ్వా సుదర్శనం చాన్యచ్చక్రం పరమదీప్తిమత్ | ఉవాచ విబుధాంస్తత్ర విష్ణుర్బుద్ధిమతాం వరః || 28

సర్వదేవవరా యూయం మద్వాక్యం శృణుతాదరాత్ | కర్తవ్యం తత్తథా శీఘ్రం తతశ్శం వో భవిష్యతి || 29

దివ్యాంబరాంగనాస్సంతి పాతాలే ¸ంవనాన్వితాః | తాభిస్సార్ధం మహాక్రీడాం యః కరోతు కరోతు సః || 30

తచ్ఛ్రుత్వా కేశవాద్వాక్యం శూరాస్తి దశయోనయః | ప్రవేష్టు కామాః పాతాలం బభూవుర్విష్ణునా సహ || 31

విచారమథ విజ్ఞాయ తం తదా భగవాన్ హరః | క్రోధాచ్ఛాపం దదౌ ఘోరం దేవ యోన్యష్టకస్య చ || 32

నందీశ్వరుడిట్లు పలికెను-

ఇట్లు పలికి శివుడు కాలాగ్నివంటి కాంతులతో జ్వలించే, దుష్టులనందరినీ సంహరించే, శ్రేష్టమగు దివ్యచక్రమును సృష్ఠించెను(26) పదివేల ప్రళయకాల సూర్యులను బోలియున్న ఆ చక్రమును మహర్షులను దేవాదుల నందరినీ రక్షించే మహాత్ముడగు విష్ణువునకు ఇచ్చెను(27). బుద్ధిమంతులలో శ్రేష్టుడగు విష్ణువు గొప్ప కాంతులనీనే మరియొక సుదర్శనచక్రమును పొంది అచటనున్న దేవతలతో నిట్లనెను(28). ఓ దేవశ్రేష్ఠులారా! మీరందరు నామాటను శ్రద్ధతో వినుడు. వెంటనే నేను చెప్పినట్లు చేయుడు. మీకు మంగళము కలుగగలదు (29). పాతాళములో దివ్యమగు వస్త్రములను ధరించిన ¸ంవనవతులగు సుందర స్త్రీలు గలరు. వారిలో కలిసి ఎవరు క్రీడించగోరెదరో, వారు క్రీడించెదరు గాక! (30) విష్ణువు యొక్క ఆ పలుకులను విని శూరులగు దేవతలు విష్ణువుతో గూడి పాతాలమును ప్రవేశించగోరిరి(31). అపుడు హరభగవానుడు వారి ఆ ఆలోచనను యెరింగి కోపముతో ఎనిమిది దేవయోనులకు ఘోరమగు శాపమునిచ్చెను(32).

హర ఉవాచ|

వర్జయిత్వా మునిం శాంతం దానవాన్ వా మదంశజమ్ | ఇదం యః ప్రవిశేత్ తస్య స్యాన్నిధనం క్షణాత్ || 33

శ్రుత్వా వాచమిదం ఘోరం మన్యష్యహితవర్ధనమ్ | ప్రత్యాఖ్యాతాస్తు రుద్రేణ దేవాస్స్వగృహమాయయుః || 34

ఏవం స్త్రీలంపటో విష్ణుశ్శివేన ప్రతి శాసితః | స్వర్లోకమగమద్వ్యాస స్వాస్థ్యం ప్రాప జగచ్చ తత్ || 35é

వృషేశ్వరో%పి భగవాన్ శంకరో భక్తవత్సలః | ఇత్థం కృత్వా దేవకార్యం జగామ స్వగిరీశ్వరమ్ || 36

వృషేశ్వరావతారస్తు వర్ణితశ్శంకరస్య చ | విష్ణుమోహహర శ్శర్వస్సై#్రలోక్య సుఖకారకః || 37

పవిత్రమిద మాఖ్యానం శత్రు బాధాహరం పరమ్ | స్వర్గ్యం యశస్యమాయుష్యం భుక్తిముక్తి ప్రదం సతామ్ || 38

య ఇదం శృణుయాద్భక్త్యా శ్రావయేద్వా సమాహితః | స భుక్త్వా సకలాన్ కామానంతే మోక్షమవాప్నుయాత్ || 39

ఇతి శ్రీ శివమహాపురాణ  శతరుద్రసంహితాయాం వృషేశ్వరావతార వర్ణనం నామ త్రయోవింశో%ధ్యాయః (23).

శివుడు ఇట్లు పలికెను-

జితేంద్రియుడగు మునిని, రాక్షసులను, మరియు నా అంశవలన జన్మించిన వారిని మినహాయించి, ఎవరైననూ ఈ స్థానమును ప్రవేశించినచో, వారు వెంటనే మృత్యువు వాత పడెదరు (33). మనుష్యుల హితమును వర్ధిల్ల జేయు ఈ ఘోరమగు శాపవచనమును విని రుద్రునిచే తిరస్కరింపబడిన వారై, దేవతలు తమ గృహములకు వెళ్లిరి (34). ఓ వ్యాసా! స్త్రీలంపటుడగు విష్ణువు ఈ విధముగా శివునిచే శాసింపబడినవాడై, స్వర్గలోకమునకు వెళ్లెను. జగత్తునకు స్వస్థత సమగూరెను (35). భక్త వత్సలుడగు శంకరుడు వృషభావతారములో ఈ తీరున దేవకార్యమును చేసి శ్రేష్ఠమగు తన కైలాసమునకు వెళ్లెను (36). విష్ణువు యొక్క మోహమును పోగొట్టి ముల్లోకములకు సుఖమును కలిగించిన మంగళకరుడగు శివుని వృషేశ్వరావతారము వర్ణించబడెను (37).

పవిత్రమగు ఈ వృత్తాంతము నిశ్చితముగా శత్రుబాధను పోగొట్టి సత్పురుషులకు స్వర్గమును, యశస్సును, ఆయుర్దాయమును, భుక్తిని మరియు ముక్తిని ఇచ్చును (38). ఎవడైతే దీనిని భక్తితో వినునో, మనస్సును లగ్నము చేసి వినిపించునో, అట్టివాడు సమస్త సుఖములను అనుభవించి, దేహత్యాగానంతరము మోక్షమును పొందును (39).

శ్రీ శివమహాపురాణములోని శతరుద్ర సంహితయందు వృషేశ్వరావతార వర్ణనమనే ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).